4:05* సూఉ:6:39 సూఅ:18:18

**ఫిబ్రవరి 26** ఆ. శు.సప్తమి 4:06* భరణి 7:32 ఇంద్ర 19:37 గరజి 16:05 వణిజ 4:06* సూఉ:6:38 సూఅ:18:19

**27** సో. శు.అష్టమి 4:38* కృత్తిక 8:13 వైధృతి 18:43 విష్టి 16:22 బవ 4:38* సూఉ:6:38 సూఅ:18:19

**28** మం. శు.నవమి 5:40* రోహిణి 9:25 విష్కంభ 18:13 బాలవ 17:09 కౌలవ 5:40* సూఉ:6:37 సూఅ:18:19 శ్రీ దుర్గాంబ రథోత్సవం

**మార్చ్ 1** బు. శు.దశమి పూర్తి మృగశిర 11:06 ప్రీతి 18:05 తైతుల 18:24 సూఉ:6:36 సూఅ:18:19

**2** గు. శు.దశమి 7:09 ఆరుద్ర 13:11 ఆయుష్మాన్ 18:16 గరజి 7:09 వణిజ 20:04 సూఉ:6:36 సూఅ:18:20

**3** శు. శు.ఏకాదశి 8:59 పునర్వసు 15:33 సౌభాగ్య 18:40 విష్టి 8:59 బవ 22:01 సూఉ:6:35 సూఅ:18:20

**4** శ. శు.ద్వాదశి 11:04 పుష్యమి 18:07 శోభన 19:13 బాలవ 11:04 కౌలవ 0:07* సూఉ:6:34 సూఅ:18:20 నృసింహద్వాదశీ, ఆమలకపూజా

**5** ఆ. శు.త్రయోదశి 13:09 ఆశ్లేషా 20:44 అతిగండ 19:45 తైతుల 13:09 గరజి 2:11* సూఉ:6:34 సూఅ:18:21 కామదహనం

**6** సో. శు.చతుర్దశి 15:12 మఖ 23:11 సుకర్మ 20:12 వణిజ 15:12 విష్టి 4:04* సూఉ:6:33 సూఅ:18:21

**7** మం. పూర్ణిమ 16:57 పుబ్బ 1:22* ధృతి 20:25 బవ 16:57 సూఉ :6:32 సూఅ:18:21 మదనపూర్ణిమా, హెూళి, బ్రహ్మ సావర్ణిరమన్వాది

**8** బు. బ.పాడ్యమి 18:18 ఉత్తర 3:04* శూల 20:20 బాలవ 5:37 కౌలవ 18:18 సూఉ:6:32 సూఅ:18:21 వసంతోత్సవః

**9** గు. బ.విదియ 19:12* హస్త 4:21* గండ 19:52 తైతుల 6:45 గరజి 19:12 సూఉ:6:31 సూఅ:18:22 చాతుర్మాస్యాద్వితీయా

**10** శు. బ.తదియ 19:35 చిత్త 5:09* వృద్ధి 19:02 వణిజ 7:24 విష్టి 19:35 సూఉ:6:30 సూఅ:18:22

**11** శ. బ.చవితి 19:27 స్వాతి 5:26* ధృవ 17:49 బవ 7:31 బాలవ 19:27 సూఉ:6:29 సూఅ:18:22

**12** ఆ. బ.పంచమి 18:49 విశాఖ 5:17* వ్యాఘాత 16:12 కౌలవ 7:08

తైతుల 18:49 గరజి 6:17* సూఉ:6:29 సూఅ:18:22

**మార్చ్ 13** సో. బ.షష్ఠి 17:45 అనురాధ 4:42* హర్షణ 14:13 వణిజ 17:45 విష్టి 5:01* సూఉ:6:28 సూఅ:18:23

**14** మం. బ.సప్తమి 16:16 జ్యేష్ఠ 3:45* వజ్ర 11:56 బవ 16:16 బాలవ 3:22* సూఉ:6:27 సూఅ:18:23

**15** బు. బ.అష్టమి 14:28 మూల 2:32* సిద్ధి 9:21 కౌలవ 14:28 తైతుల 1:27* సూఉ:6:26 సూఅ:18:23

**16** గు. బ.నవమి 12:25 పూర్వాషాఢ 1:03* వ్యతీపాత 6:35 వరీయాన్ 3:36* గరజి 12:25 వణిజ 23:18 సూఉ:6:25 సూఅ:18:23

**17** శు. బ.దశమి 10:10 ఉత్తరాషాఢ 0:06 పరిఘ 0:32* విష్టి 10:10 బవ 20:59 సూఉ:6:25:సూఅ:18:23

**18** శ. బ.ఏకాదశి 7:47 బ.ద్వాదశి 5:24* శ్రవణం 21:47 శివ 22:04 బాలవ 7:47 కౌలవ 18:36 తైతుల 5:24* సూఉ:6:24 సూఅ:18:24 జగద్గురు శ్రీ సచ్చిదానంద శివభినవ నృసింహ భారతి మహాస్వామివారి జయంతి

**19** ఆ. బ.త్రయోదశి 3:03* ధనిష్ఠ 20:09 సిద్ధ 18:20 గరజి 16:13 వణిజ 3:03* సూఉ:6:23 సూఅ:18:24

**20** సో. బ.చతుర్దశి 0:51* శతభిషం 18:37 సాధ్య 15:19 విష్టి 13:57 శకుని 0:51* సూఉ:6:22 సూఅ:18:24 మాసశివరాత్రి

**21** మం. బ.అమావాస్య 22:50 పూర్వాభాద్ర 17:17 శుభ 12:28 చతుష్పత్ 8:43 నాగవ 20:50 సూఉ:6:22 సూఅ:18:24

## శ్రీ శోభకృత్ నామ సంవత్సరం చైత్ర మాసం వసంతఋతువు ఉత్తరాయణం మార్చ్ 22 నుండి ఏప్రిల్ 20 2023 వరకు

**మార్చ్ 22** బు. శు.పాడ్యమి 21:08 ఉత్తరాభాద్ర 16:13 శుక్ల 9:48 కింస్తుఘ్న 8:08 బవ 21:08 సూఉ:6:21 సూఅ:18:24

**23** గు. శు.విదియ 19:47 రేవతి 15:29 బ్రహ్మ 7:24 బాలవ 8:27 కౌలవ 19:47 సూఉ:6:20 సూఅ:18:25

## 2022-2023 లో మౌఢ్యమి, కర్తరి, పుష్కరాలు,గ్రహణాల వివరాలు

గురు మౌఢ్యమి: ఈ సంవత్సరం గురు మౌఢ్యమి లేదు.

**శుక్ర మూఢ్యమి:** 15.09.2022 భాద్రపద బ.పంచమి గురువారం నుండి 02.12.2022 మార్గశిర శు.నవమి శుక్రవారం వరకు.

**వాస్తు కర్తరి:** 04.05.2022 నుండి 29.05.2022 వరకు వాస్తు కర్తరి

**పుష్కరములు:** 13.04.2022 చైత్ర శు.ద్వాదశి బుధవారం నుండి 27.04.2022 చైత్ర బ.ద్వాదశి బుధవారం వరకు సార్ధత్రికోటి తీర్ధ రాజ సహిత ప్రిణీత నదీ పుష్కరములు.

**గ్రహణాలు: సూర్యగ్రహణము** 25.10.2022 ఆశ్వయుజ బ.అమావాస్య మంగళవారం తులారాశిలో కేతుగ్రస్త సూర్యగ్రహణం. గ్రహణ మధ్యకాలం: సా.05.45

**చంద్రగ్రహణం:** 08.11.2022 కార్తిక శు.పూర్ణిమ మంగళవారం రాహుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణము. ఈ చంద్ర గ్రహణం పగటి కాలంలో ఏర్పడుతోంది కనుక కంటికి కనపడదు. గ్రహణ మధ్యకాలం: సా.04.29

# శుభ ముహూర్తాలు 2022-23

## వివాహ, గృహారంభ, గృహ ప్రవేశ, ఉపనయన, అన్నప్రాశన, వ్యాపారములకు ముహూర్తాలు

### శ్రీ శుభకృత్ నామ సంవత్సరం చైత్రమాసం వసంతఋతువు ఉత్తరాయణం

**ఏప్రిల్ 02 నుండి ఏప్రిల్ 30 2022 వరకు**

**ఏప్రిల్-2022**

10 ఆదివారం చైత్ర శు.నవమి పుష్యమి మేష ఉ.7.26 గృహారంభం మిథున ఉ.11.49 వ్యాపారం మిథున ఉ.11.49 గృహారంభం.

14 గురువారం చైత్ర శు.త్రయోదశి ఉత్తర ధనుస్సు రా.12.30 వివాహం

15 శుక్రవారం చైత్ర శు.చతుర్దశి హస్త మిథున ఉ.11.30 వివాహం వ్యాపారం వృశ్చిక రా.9.08 వివాహం, వ్యాపారం

16 శనివారం చైత్ర పూర్ణిమ హస్త వృషభ ఉ.8.30 వివాహం వ్యాపారం చిత్త మిథున ఉ.11.26 వివాహం వ్యాపారం ధనుస్సు రా.12.22 వివాహం, చైత్ర బహుళ పాడ్యమి చిత్త మీన తె.4.42 వివాహం

17 ఆదివారం చైత్ర బ.పాడ్యమి స్వాతి వృషభ ఉ.8.26 వివాహం వ్యాపారం గృహారంభం మిథున ఉ.11.22 వివాహం వ్యాపారం గృహారంభం వృశ్చిక రా.9.00 వివాహం వ్యాపారం, చైత్ర బ.విదియ స్వాతి ధనుస్సు రా.12.18 వివాహంమీన తె.4.38 వివాహం

20 బుధవారం చైత్ర బ.పంచమి మూల ధనుస్సు రా.12.07 వివాహం, మీన తె.4.26 వివాహం

21 గురువారం చైత్ర బ.పంచమి మూల మిథున ఉ.11.06 వ్యాపారం గృహారంభం

22 శుక్రవారం చైత్ర బ.సప్తమి ఉత్తరాషాఢ ధనుస్సు రా.11.59 వివాహం

23 శనివారం చైత్ర బ.అష్టమి ఉత్తరాషాఢ వృషభ ఉ.8.02 వివాహం వ్యాపారం గృహారంభం,గృహప్రవేశం,మిథున ఉ.10.58 వివాహం వ్యాపారం గృహారంభం, శ్రవణం మీన తె.4.15 వివాహం

24 ఆదివారం చైత్ర బ.నవమి శ్రవణం వృషభ ఉ.7.58 వివాహం వ్యాపారం గృహారంభం,మిథున ఉ.10.54 వివాహం వ్యాపారం గృహారంభం, చైత్ర బ.దశమి ధనిష్ఠ మీన తె.4.11 వివాహం

25 సోమ చైత్ర బ.దశమి ధనిష్ఠ వృషభ ఉ.7.54 వ్యాపారం గృహారంభం గృహప్రవేశం, మిథున ఉ.10.50 వ్యాపారం గృహారంభం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం వైశాఖ మాసం వసంతఋతువు ఉత్తరాయణం

**మే 01 నుండి మే 30 2022 వరకు**

**మే-2022**

4 బుధవారం వైశాఖ శు.తదియ మృగశిర వృషభ ఉ.7.19 వివాహం వ్యాపారం

4 బుధవారం వైశాఖ శు.చవితి మృగశిర మకర రా.12.41 వివాహం, మీన తె.3.31 వివాహం

6 శుక్రవారం వైశాఖ శు.పంచమి పునర్వసు మిథున ఉ.10.07 వివాహం వ్యాపారం

7 శనివారం వైశాఖ శు.షష్ఠి పునర్వసు మిథున ఉ.10.03 వ్యాపారం

8 ఆదివారం వైశాఖ శు.సప్తమి పుష్యమి వృషభ ఉ.7.03 వ్యాపారం, మిథున ఉ.9.59 వ్యాపారం

12 గురువారం వైశాఖ శు.ఏకాదశి ఉత్తర వృషభ ఉ.6.48 వివాహం వ్యాపారం, శు ద్వాదశి హస్త మకర రా.12.10.వివాహం

13 శుక్రవారం వైశాఖ శు. ద్వాదశి హస్త మిథున ఉ.9.40 వివాహం వ్యాపారం, శు .త్రయోదశి చిత్త మకర రా.12.06 వివాహం

14 శనివారం వైశాఖ శు.చతుర్దశి స్వాతి మీన తె.2.52 వివాహం

15 ఆదివారం వైశాఖ శు.చతుర్దశి స్వాతి మిథున ఉ.9.32 వివాహం వ్యాపారం

18 బుధవారం వైశాఖ బ.తదియ మూల మిథున ఉ.9.20 వ్యాపారం కర్క ఉ.10.20 వివాహం,వ్యాపారం ధనుస్సు రా.10.17 వివాహం వ్యాపారం

20 శుక్రవారం వైశాఖ బ.పంచమి ఉత్తరాషాఢ కర్క ఉ.10.12 వ్యాపారం, బ.షష్ఠి ఉత్తరాషాఢ ధనుస్సు రా.10.09 వివాహం వ్యాపారం, మకర రా.11.38 వివాహం

21 శనివారం వైశాఖ బ.షష్ఠి శ్రవణం మిథున ఉ.9.08 వివాహం వ్యాపారం,కర్క ఉ.10.08 వ్యాపారం బ.సప్తమి శ్రవణం ధనుస్సు రా.10.05 వివాహం వ్యాపారం, మకర రా.11.35 వివాహం

22 ఆదివారం వైశాఖ బ.సప్తమి ధనిష్ఠ మిథున ఉ.9.04 వివాహం వ్యాపారం,కర్క ఉ 10.04 వ్యాపారం బ.అష్టమి ధనిష్ఠ ధనుస్సు రా.10.01 వివాహం వ్యాపారం, శతభిష మకర రా.11.31 వివాహం

23 సోమవారం వైశాఖ బ.నవమి శతభిష ధనుస్సు రా.9.57 వ్యాపారం

25 బుధవారం వైశాఖ బ.ఏకాదశి ఉత్తరాబాద్ర ధనుస్సు రా.9.49 వివాహం వ్యాపారం

26 గురువారం వైశాఖ బ.ఏకాదశి రేవతి మిథున ఉ.8.49 వివాహం వ్యాపారం, కర్క ఉ.9.48 వివాహం వ్యాపారం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం జ్యేష్ఠమాసం గ్రీష్మఋతువు ఉత్తరాయణం

**మే 31 నుండి జూన్ 28 2022 వరకు**

**జూన్-2022**

1 బుధవారం జ్యేష్ఠ శు.విదియ మృగశిర మిథున ఉ.8.25 వివాహం వ్యాపారం, కర్క ఉ.9.25 వివాహం వ్యాపారం

2 గురువారం జ్యేష్ఠ శు.తదియ పునర్వసు మకర రా.10.47 వివాహం

3 శుక్రవారం జ్యేష్ఠ శు.చవితి పునర్వసు కర్క ఉ.9.17 వ్యాపారం, పుష్యమి ధనుస్సు రా.9.14 వ్యాపారం

4 శనివారం జ్యేష్ఠ శు.పంచమి పుష్యమి మిథున ఉ.8.13 వ్యాపారం గృహారంభం

6 సోమవారం జ్యేష్ఠ శు.సప్తమి మఖ మిథున ఉ.8.05 వ్యాపారం గృహప్రవేశం, కర్క ఉ 9.05 వ్యాపారం

8 బుధవారం జ్యేష్ఠ శు.అష్టమి ఉత్తర మిథున ఉ.7.58 వివాహం వ్యాపారం గృహారంభం గృహప్రవేశం శు.నవమి ఉత్తర కర్క ఉ.8.57 వివాహం వ్యాపారం గృహారంభర ధనుస్సు రా.8.54 వివాహం వ్యాపారం మకర రా.10.24 వివాహం

9 గురువారం జ్యేష్ఠ శు.నవమి హస్త మిథున ఉ.7.54 వివాహం వ్యాపారం గృహరంభం, శు.దశమి హస్త కర్క ఉ.8.53 వివాహం వ్యాపారం గృహారంభం ధనుస్సు రా.8.50 వివాహం వ్యాపారం

10 శుక్రవారం జ్యేష్ఠ శు.ఏకాదశి చిత్త మిథున ఉ.7.50 వివాహం వ్యాపారం మకర రా.10.16 వివాహం

11 శనివారం జ్యేష్ఠ శు.ద్వాదశి స్వాతి మిథున ఉ.7.46 వివాహం వ్యాపారం, ధనుస్సు రా.8.42 వివాహం వ్యాపారం, మకర రా.10.12 వివాహం

13 సోమవారం జ్యేష్ఠ శు.చతుర్దశి అనురాధ మిథున ఉ.7.38 వ్యాపారం గృహారంభం గృహప్రవేశం

15 బుధవారం జ్యేష్ఠ బ.పాడ్యమి మూల కర్క ఉ.8.29 వివాహం వ్యాపారం గృహారంభం

17 శుక్రవారం జ్యేష్ఠ బ.చవితి శ్రవణం వృషభ తె.4.26 వివాహం, మకర రా.9.48 వివాహం

18 శనివారం జ్యేష్ఠ బ.పంచమి ధనిష్ఠ కర్క ఉ.8.18 వ్యాపారం గృహారంభం, మకర రా.9.44 వివాహం గృహప్రవేశం, జ్యేష్ఠ బ.షష్ఠి ధనిష్ఠ వృషభ తె.4.22 వివాహం

19 ఆదివారం జ్యేష్ఠ బ.షష్ఠి శతభిష కర్క ఉ.8.14 వివాహం వ్యాపారం గృహారంభం, మకర రా.9.40 వివాహం గృహప్రవేశం, బ.సప్తమి శతభిష వృషభ తె.4.18 వివాహం

22 బుధవారం జ్యేష్ఠ బ.నవమి రేవతి కర్క ఉ.8.02 వివాహం వ్యాపారం గృహారంభం, బ.దశమి రేవతి మకర రా.9.29 వివాహం గృహప్రవేశం

23 గురువారం జ్యేష్ఠ బ.దశమి అశ్విని మకర రా.9.25 వివాహం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం ఆషాఢమాసం గ్రీష్మఋతువు ఉత్తరాయణం దక్షిణాయణం

**జూన్ 29 నుండి జులై 28 2022 వరకు**

**జూలై-2022**

1 శుక్రవారం ఆషాఢ శు.విదియ పుష్యమి కర్క ఉ.7.26 వ్యాపారం

3 ఆదివారం ఆషాఢ శు.చవితి మఖ కర్క ఉ.7.18 వ్యాపారం

4 సోమవారం ఆషాఢ శు.పంచమి మఖ కర్క ఉ.7.14 వ్యాపారం

6 బుధవారం ఆషాఢ శు.సప్తమి ఉత్తర కర్క ఉ.7.07 వ్యాపారం

7 గురువారం ఆషాఢ శు.అష్టమి హస్త కర్క ఉ.7.03 వ్యాపారం

8 శుక్రవారం ఆషాఢ శు.నవమి చిత్త కర్క ఉ.6.59 వ్యాపారం

14 గురువారం ఆషాఢ బ.విదియ శ్రవణం కుంభ రా.10.12 వ్యాపారం

15 శుక్రవారం ఆషాఢ బ.విదియ శ్రవణం సింహ ఉ.9.44 వ్యాపారం 9.44 అన్నప్రాసన

16 శనివారం ఆషాఢ బ.తదియ ధనిష్ఠ సింహ ఉ.9.40 వ్యాపారం అన్నప్రాసన

17 ఆదివారం ఆషాఢ బ.చవితి శతభిష సింహ ఉ.9.36 వ్యాపారం అన్నప్రాసన

20 బుధవారం ఆషాఢ బ.అష్టమి రేవతి సింహ ఉ.9.24 వ్యాపారం అన్నప్రాసన, అశ్విని కుంభ రా.9.49 వ్యాపారం

23 శనివారం ఆషాఢ బ.ఏకాదశి రోహిణి కుంభ రా.9.37 వ్యాపారం

24 ఆది ఆషాఢ బ.ఏకాదశి రోహిణి సింహ ఉ.9.08 వ్యాపారం, బ.ద్వాదశి రోహిణ కుంభ రా.9.33 వ్యాపారం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం శ్రావణమాసం వర్ష ఋతువు దక్షిణాయణం

**జులై 29 నుండి ఆగష్టు 27 2022 వరకు**

**జులై** 30 శనివారం శ్రావణ శు.విదియ మఖ కుంభ రా.9.10 వ్యాపారం గృహప్రవేశం

31 ఆదివారం శ్రావణ శు.తదియ మఖ సింహ ఉ.8.41 వివాహం వ్యాపారం అన్నప్రాసన గృహప్రవేశం

**ఆగష్టు-2022**

1 సోమవారం శ్రావణ శు.చవితి ఉత్తర కుంభం రా.9.02 వ్యాపారం గృహప్రవేశం

3 బుధవారం శ్రావణ శు.షష్ఠి చిత్త కుంభం రా.8.54 వ్యాపారం గృహప్రవేశం

4 గురువారం శ్రావణ శు.సప్తమి స్వాతి మిథున తె.4.13 వివాహం, మీన రా.9.30 వివాహం

5 శుక్రవారం శ్రావణ శు.అష్టమి స్వాతి సింహ ఉ.8.21 వివాహం వ్యాపారం అన్నప్రాసన గృహారంభం

7 ఆదివారం శ్రావణ శు.దశమి అనురాధ సింహ ఉ.8.14 వివాహం వ్యాపారం అన్నప్రాసన

8 సోమవారం శ్రావణ శు.ఏకాదశి మూల కుంభ రా.8.34 వ్యాపారం గృహప్రవేశం

10 బుధవారం శ్రావణ శు.చతుర్దశి ఉత్తరాషాఢ మిథున తె.3.50 వివాహం, కుంభ రా.8.26 వ్యాపారం గృహప్రవేశం, మీన రా.9.06 వివాహం గృహప్రవేశం

11 గురువారం శ్రావణ శు.చతుర్దశి శ్రవణం సింహ ఉ.7.58 వివాహం వ్యాపారం గృహారంభం

పూర్ణిమ శ్రవణం మిథున తె.3.46 వివాహం, కుంభ రా.8.23 వ్యాపారం, మీన రా.9.02 వివాహం

12 శుక్రవారం శ్రావణ బ.పాడ్యమి శతభిష మిథున తె.3.42 వివాహం, ధనిష్ఠ సింహ ఉ .7.54 వివాహం వ్యాపారం గృహారంభం,గృహప్రవేశం, మీన రా.8.58 వివాహం గృహప్రవేశం

13 శనివారం శ్రావణ బ.విదియ శతభిష కుంభ రా.8.15 వ్యాపారం

14 ఆదివారం శ్రావణ బ.చవితి ఉత్తరభాద్ర మిథున తె.3.34 వివాహం

15 సోమవారం శ్రావణ బ.చవితి ఉత్తరాబాద్ర కుంభ రా.8.07 వ్యాపారం గృహప్రవేశం

17 బుధవారం శ్రావణ బ.షష్ఠి అశ్విని కన్యా ఉ.9.10 అన్నప్రాసన గృహారంభం, బ.సప్తమి అశ్విని మీన రా.8.39 వివాహం

20 శనివారం శ్రావణ బ.దశమి రోహిణి మిథున తె.3.11 వివాహం

20 శనివారం శ్రావణ బ.నవమి రోహిణి కన్యా ఉ.8.58 అన్నప్రాసన

21 ఆదివారం శ్రావణ బ.దశమి మృగశిర మిథున తె.3.07 వివాహం, కన్యా ఉ.8.54 అన్నప్రాసన

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం భాద్రపదమాసం వర్ష ఋతువు దక్షిణాయణం

**ఆగష్టు 28 నుండి సెప్టెంబర్ 25 2022 వరకు**

**ఆగష్టు** 29 సోమవారం భాద్రపద శు. విదియ ఉత్తర కన్యా ఉ.8.23 అన్నప్రాసన

సెప్టెంబర్ -2022

3 శనివారం భాద్రపద శు.సప్తమి అనురాధ కన్యా ఉ.8.03 అన్నప్రాసన

5 సోమవారం భాద్రపద శు.నవమి మూల కన్య ఉ.7.55 అన్నప్రాసన

7 బుధవారం భాద్రపద శు.ద్వాదశి ఉత్తరాషాఢ కన్యా ఉ.7.48 అన్నప్రాసన

8 గురువారం భాద్రపద శు.త్రయోదశి శ్రవణం కన్యా ఉ.7.44 అన్నప్రాసన

12 సోమవారం భాద్రపద బ.విదియ రేవతి కన్యా ఉ.7.28 అన్నప్రాసన

**సెప్టెంబర్ 14 నుండి డిసెంబర్ 01 2022 వరకు**

**శుక్ర మౌఢ్యమి ఉన్నందున వివాహాది శుభ కార్యాలు ఉండవు.**

**శ్రీ శుభకృత్ నామ సంవత్సరం మార్గశిరమాసం హేమంత ఋతువు దక్షిణాయణం**

**నవంబర్ 24 నుండి డిసెంబర్ 23 2022 వరకు**

**డిసెంబర్** 2 శుక్రవారం మార్గశిర శు.దశమి ఉత్తరభాద్ర మిథున రా.8.18 వ్యాపారం, సింహ రా.12.30 వివాహం

3 శనివారం మార్గశిర శు.ఏకాదశి రేవతి సింహ రా.12.26 వివాహం, ధనుస్సు ఉ.9.11 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

4 ఆదివారం మార్గశిర శు.ద్వాదశి అశ్విని మిథున రా.8.10 వ్యాపారం,సింహ రా.12.22 వివాహం, ధనుస్సు ఉ.9.07 వివాహం అన్నప్రాసన గృహారంభం

8 గురువారం మార్గశిర పూర్ణిమ రోహిణి ధనుస్సు ఉ.8.52 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

10 శనివారం మార్గశిర బ.తదియ పునర్వసు మిథున రా.7.47 వ్యాపారం

11 ఆదివారం మార్గశిర బ.చవితి పునర్వసు మిథున రా.7.43 వ్యాపారం

12 సోమవారం మార్గశిర బ.చవితి పుష్యమి కుంభ మధ్యాహ్నం 12.16 వ్యాపారం, బ.పంచమి పుష్యమి మిథున రా.7.39 వ్యాపారం

14 బుధవారం మార్గశిర బ.షష్ఠి మఖ ధనుస్సు ఉ.8.28 వివాహం అన్నప్రాసన, బ.సప్తమి మఖ సింహ రా.11.43 వివాహం

16 శుక్రవారం మార్గశిర బ.అష్టమి ఉత్తర సింహ రా.11.35 వివాహం, ధనుస్సు ఉ .8.20 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం, కుంభ మధ్యాహ్నం 12.00 వ్యాపారం అన్నప్రాసన

17 శనివారం మార్గశిర బ.నవమి హస్త కుంభం ఉ.11.56 వివాహం వ్యాపారం అన్నప్రాసన

18 ఆదివారం మార్గశిర బ.దశమి చిత్త సింహ రా.11.27 వివాహం

**శుభకృత్ నామ సంవత్సరం పుష్యమాసం హేమంత ఋతువు దక్షిణాయణం ఉత్తరాయణం**

**డిసెంబర్ 24 2022 నుండి జనవరి 21 2023 వరకు**

**డిసెంబర్** 25 ఆదివారం పుష్య శు.తదియ ఉత్తరాషాఢ కుంభం ఉ.11.24 వ్యాపారం అన్నప్రాసన

26 సోమవారం పుష్య శు.చవితి శ్రవణం కుంభం ఉ.11.20 వ్యాపారం అన్నప్రాసన

28 బుధవారం పుష్య శు.షష్ఠి శతభిష కుంభం ఉ.11.12 వ్యాపారం అన్నప్రాసన

30 శుక్రవారం పుష్య శు.అష్టమి ఉత్తరాభాద్ర కుంభం ఉ.11.05 వ్యాపారం అన్నప్రాసన

31 శనివారం పుష్య శు.నవమి రేవతి కుంభం ఉ.11.01 వ్యాపారం అన్నప్రాసన

**జనవరి -2023**

4 బుధవారం పుష్య శు.త్రయోదశి మృగశిర సింహ రా.10.20 వ్యాపారం

7 శనివారం పుష్య బ.పాడ్యమి పునర్వసు కుంభం ఉ.10.33 వ్యాపారం అన్నప్రాసన

8 ఆదివారం పుష్య బ.విదియ పుష్యమి సింహ రా.10.04 వ్యాపారం,కుంభ ఉ.10.29 వ్యాపారం అన్నప్రాసన

11 బుధవారం పుష్య బ.చవితి మఖ కుంభం ఉ.10.17 వ్యాపారం అన్నప్రాసన

13 శుక్రవారం పుష్య బ.షష్ఠి ఉత్తర కుంభం ఉ.10.09 వ్యాపారం అన్నప్రాసన

14 శనివారం పుష్య బ.సప్తమి హస్త కుంభం ఉ.10.06 వ్యాపారం అన్నప్రాసన, బ.అష్టమి చిత్త సింహ రా.9.41 వ్యాపారం

15 ఆది పుష్య బ.అష్టమి చిత్త కుంభం ఉ.10.02 వ్యాపారం అన్నప్రాసన, బ.నవమి స్వాతి సింహ రా.9.37 వ్యాపారం

16 సోమవారం పుష్య బ.నవమి స్వాతి కుంభం ఉ.9.58 వ్యాపారం అన్నప్రాసన

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం మాఘమాసం శిశిర ఋతువు ఉత్తరాయణం

**జనవరి 22 నుండి ఫిబ్రవరి 20 2023 వరకు**

**జనవరి** 22 ఆదివారం మాఘ శు.విదియ శ్రవణం ధనుస్సు తె.5.54 వివాహం

26 గురువారం మాఘ శు.పంచమి ఉత్తరభాద్ర మీన ఉ.9.58 వివాహం గృహారంభం గృహప్రవేశం, శు.షష్ఠి రేవతి ధనుస్సు తె.5.39 వివాహం

27 శుక్రవారం మాఘ శు.సప్తమి అశ్విని ధనుస్సు తె.5.35 వివాహం

**ఫిబ్రవరి-2023**

1 బుధవారం మాఘ శు.ఏకాదశి మృగశిర మీన ఉ.9.35 వివాహం గృహారంభం గృహప్రవేశం

3 శుక్రవారం మాఘ శు.చతుర్దశి పునర్వసు ధనుస్సు తె.5.07 వివాహం

4 శనివారం మాఘ శు.చతుర్దశి పుష్యమి మీన ఉ.9.23 గృహారంభం

5 ఆదివారం మాఘ పూర్ణిమ పుష్యమి మీన ఉ.9.19 గృహారంభం

9 గురువారం మాఘ బ.చవితి హస్త ధనుస్సు తె.4.44 వివాహం,ఉత్తర మీన ఉ.9.03 అన్నప్రాసన

11 శనివారం మాఘ బ.షష్ఠి చిత్త కన్యా రా.9.27 గృహప్రవేశం,స్వాతి ధనుస్సు తె.4.36 వివాహం

15 బుధవారం మాఘ బ.దశమి మూల ధనుస్సు తె.4.20 వివాహం, మకర తె.5.50 వివాహం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరం ఫాల్గుణమాసం శిశిర ఋతువు ఉత్తరాయణం

**ఫిబ్రవరి 21 నుండి మార్చ్ 21 2023 వరకు**

22 బుధవారం ఫాల్గుణ శు.తదియ ఉత్తరభాద్ర మకర తె.5.22 వివాహం, మీన ఉ.8.12 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

23 గురువారం ఫాల్గుణ శు.చవితి రేవతి మీన ఉ.8.08 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం శు.పంచమి అశ్విని మకర తె.5.18 వివాహం

24 శుక్రవారం ఫాల్గుణ శు.పంచమి అశ్విని మీన ఉ.8.04 వివాహం అన్నప్రాసన గృహారంభం

**మార్చ్-2023**

1 బుధవారం ఫాల్గుణ శు.దశమి మృగశిర మీన ఉ.7.45 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

3 శుక్రవారం ఫాల్గుణ శు.ఏకాదశి పునర్వసు మీన ఉ.7.37 వివాహం అన్నప్రాసన

5 ఆదివారం ఫాల్గుణ శు.చతుర్దశి మఖ ధనుస్సు తె.3.10 వివాహం, మకర తె.4.39 వివాహం

6 సోమవారం ఫాల్గుణ శు.చతుర్దశి మఖ మీన ఉ.7.25 అన్నప్రాసన

8 బుధవారం ఫాల్గుణ బ.పాడ్యమి ఉత్తర మీన ఉ.7.17 వివాహం అన్నప్రాసన, బ.విదియ ఉత్తర ధనుస్సు తె.2.58 వివాహం

9 గురువారం ఫాల్గుణ బ.తదియ హస్త ధనుస్సు తె.2.54 వివాహం, మకర తె.4.23 వివాహం

10 శుక్రవారం ఫాల్గుణ బ.తదియ చిత్త మీన ఉ.7.09 అన్నప్రాసన, బ.చవితి చిత్త ధనుస్సు తె.2.50 వివాహం

11 శనివారం ఫాల్గుణ బ.పంచమి స్వాతి మకర తె.4.15 వివాహం

12 ఆదివారం ఫాల్గుణ బ.పంచమి స్వాతి మీన ఉ.7.01 వివాహం అన్నప్రాసన గృహారంభం

13 సోమవారం ఫాల్గుణ బ.షష్ఠి అనురాధ వృషభ ఉ.10.45 గృహారంభం గృహప్రవేశం

15 బుధవారం ఫాల్గుణ బ.అష్టమి మూల వృషభ ఉ.10.37 వివాహం గృహారంభం గృహప్రవేశం

17 శుక్రవారం ఫాల్గుణ బ.దశమి ఉత్తరాషాఢ వృషభ ఉ.10.29 వివాహం గృహారంభం గృహప్రవేశం

**గురుమోఢ్యమి మార్చి 28, 2023-ఏప్రిల్ 27, 2023 ఈ సమయంలో శుభముహూర్తాలు ఉండవు.**

## శోభకృత్ నామ సంవత్సరం వైశాఖమాసం వసంత ఋతువు ఉత్తరాయణం

**ఏప్రిల్ 21 2023 నుండి మే 19 2023 వరకు**

**ఏప్రిల్ -2023**

28 శుక్రవారం వైశాఖ శు.అష్టమి పుష్యమి వృషభ ఉ.7.43 గృహారంభం

30 ఆదివారం వైశాఖ శు.దశమి మఖ వృషభ ఉ.7.35 వివాహం గృహప్రవేశం

**మే -2023**

3 బుధవారం వైశాఖ శు.త్రయోదశి హస్త వృషభ ఉ.7.24 వివాహం

5 శుక్రవారం వైశాఖ పూర్ణిమ స్వాతి వృషభ ఉ.7.16 వివాహం

10 బుధవారం వైశాఖ బ.షష్ఠి ఉత్తరాషాఢ వృశ్చిక రాత్రి 7.31 వివాహం వ్యాపారం మీనం తె.3.09 వివాహం

11 గురువారం వైశాఖ బ.షష్ఠి ఉత్తరాషాఢ వృషభ ఉ.6.52 వివాహం వ్యాపారం, మిథున ఉ.9.48 వివాహం ఉపనయనం అన్నప్రాసన, బ.సప్తమి శ్రవణం మీనం తె.3.05 వివాహం

12 శుక్రవారం వైశాఖ బ.సప్తమి శ్రవణం వృషభ ఉ.6.48 వివాహం వ్యాపారం మిథున ఉ.9.45 వివాహం అన్నప్రాసన, బ.అష్టమి ధనిష్ఠ వృశ్చిక రాత్రి 7.23 వివాహం వ్యాపారం మీనం తె.3.01 వివాహం

13 శనివారం వైశాఖ బ.నవమి ధనిష్ఠ మిథున ఉ.9.41 వివాహం ఉపనయనం అన్నప్రాసన

14 ఆదివారం వైశాఖ బ.దశమి శతభిష మిథున ఉ.9.37 వివాహం ఉపనయనం అన్నప్రాసన

15 సోమవారం వైశాఖ బ.ఏకాదశి ఉత్తరాభాద్ర మిథున ఉ.9.33 ఉపనయనం

## శోభకృత్ నామ సంవత్సరం జ్యేష్ఠమాసం వసంత ఋతువు ఉత్తరాయణం

**మే 20, 2023 నుండి జూన్ 18, 2023 వరకు**

**మే** 21 ఆదివారం జ్యేష్ఠ శు.తదియ మృగశిర మీనం తె.2.26 వివాహం

22 సోమవారం జ్యేష్ఠ శు.తదియ మృగశిర మిథున ఉ.9.05 అన్నప్రాసన

26 శుక్రవారం జ్యేష్ఠ శు.సప్తమి మఖ మీనం తె.2.06 వివాహం

31 బుధవారం జ్యేష్ఠ శు.ఏకాదశి చిత్త మిథున ఉ.8.30 వివాహం అన్నప్రాసన, శు .ద్వాదశి చిత్త మీనం తె.1.46 వివాహం

**జూన్ -2023**

1 గురువారం జ్యేష్ఠ శు.ద్వాదశి స్వాతి మిథున ఉ.8.26 వివాహం అన్నప్రాసన శు .త్రయోదశి స్వాతి మీనం తె.1.42 వివాహం

3 శనివారం జ్యేష్ఠ శు.చతుర్దశి అనురాధ మిథున ఉ.8.18 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

5 సోమవారం జ్యేష్ఠ బ.విదియ మూల మిథున ఉ.8.10 అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

8 గురువారం జ్యేష్ఠ బ.పంచమి శ్రవణం మిథున ఉ.7.58 వివాహం అన్నప్రాసన గృహారంభం

9 శుక్రవారం జ్యేష్ఠ బ.షష్ఠి ధనిష్ఠ మిథున ఉ.7.54 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

10 శనివారం జ్యేష్ఠ బ.సప్తమి శతభిష మిథున ఉ.7.51 వివాహం అన్నప్రాసన గృహారంభం గృహప్రవేశం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరములో
## రవ్యాదిగ్రహ - నక్షత్ర, రాశి ప్రవేశములు

| | |
|---|---|
| 31 మార్చి 2022 08:26 శుక్ర కుంభం | 25 మే 2022 14:51 రవి రోహిణి |
| 31 మార్చి 2022 19:25 రవి రేవతి | 4 జూన్ 2022 05:23 శుక్ర భరణి |
| 2 ఏప్రిల్ 2022 00:46 బుధ రేవతి | 8 జూన 2022 12:37 రవి మృగశిర |
| 6 ఏప్రిల్ 2022 15:09 శుక్ర శతభిషం | 8 జూన 2022 19:35 కుజ రేవతి |
| 7 ఏప్రిల్ 2022 14:56 కుజ కుంభం | 14 జూన్ 2022 18:59 రాహు భరణి |
| 8 ఏప్రిల్ 2022 11:51 బుధ మేషం,అశ్విని | 15 జూన 2022 12:03 రవి మిథునం |
| 12 ఏప్రిల్ 2022 20:10 రాహు మేషం కేతు తుల | 15 జూన 2022 12:30 శుక్ర కృత్తిక |
| 13 ఏప్రిల్ 2022 14:44 గురు మీనం | 18 జూన్ 2022 07:59 శుక్ర వృషభం |
| 14 ఏప్రిల్ 2022 08:41 రవి అశ్విని మేషం | 18 జూన్ 2022 12:17 బుధ రోహిణి |
| 15 ఏప్రిల్ 2022 01:12 బుధ భరణి | 22 జూన 2022 11:42 రవి ఆరుద్ర |
| 16 ఏప్రిల్ 2022 10:38 కుజ శతభిషం | 26 జూన్ 2022 17:44 శుక్ర రోహిణి |
| 18 ఏప్రిల్ 2022 19:56 శుక్ర పూర్వాభాద్ర | 27 జూన్ 2022 05:11 కుజ అశ్విని, మేషం |
| 22 ఏప్రిల్ 2022 15:59 బుధ కృత్తిక | 28 జూన్ 2022 12:17 బుధ మృగశిర |
| 25 ఏప్రిల్ 2022 00:05 బుధ వృషభం | 2 జూలై 2022 09:32 బుధ మిథునం |
| 27 ఏప్రిల్ 2022 18:03 శుక్ర మీనం | 5 జూలై 2022 21:55 బుధ ఆర్ద్ర |
| 28 ఏప్రిల్ 2022 20:11 గురు ఉత్తరాభాద్ర | 6 జూలై 2022 11:11 రవి పునర్వసు |
| 29 ఏప్రిల్ 2022 03:32 శని కుంభం | 7 జూలై 2022 21:18 శుక్ర మృగశిర |
| 30 ఏప్రిల్ 2022 16:39 శుక్ర ఉత్తరాభాద్ర | 12 జూలై 2022 08:19 బుధ పునర్వసు |
| 4 మే 2022 02:04 కుజ పూర్వాభాద్ర | 12 జూలై 2022 21:36 శని(వ.త్యా) మకరం |
| 6 మే 2022 16:13 బుధ రోహిణి | 13 జూలై 2022 10:31 శుక్ర మిథునం |
| 11 మే 2022 18:35 రవి కృత్తిక | 16 జూలై 2022 07:22 కుజ భరణి |
| 12 మే 2022 08:15 శుక్ర రేవతి | 16 జూలై 2022 23:58 బుధ కర్కాటకం |
| 14 మే 2022 22:44 బుధ(వ) కృత్తిక | 16 జూలై 2022 22:56 రవి కర్కటకం |
| 15 మే 2022 05:29 రవి వృషభం | 18 జూలై 2022 13:30 బుధ పుష్యమి |
| 17 మే 2022 09:11 కుజ మీనం | 18 జూలై 2022 23:19 శుక్ర ఆర్ద్ర |
| 21 మే 2022 20:02 కుజ ఉత్తరాభాద్ర | 20 జూలై 2022 10:48 రవి పుష్య |
| 23 మే 2022 20:12 శుక్ర అశ్విని,మేషం | 25 జూలై 2022 01:13 బుధ ఆశ్లేష |

29 జూలై 2022 23:42 శుక్ర పునర్వసు
1 ఆగస్ట్ 2022 03:30 బుధ మఘ,సింహం
3 ఆగష్టు 2022 09:37 రవి ఆశ్లేష
5 ఆగష్టు 2022 12:40 కుజ కృత్తిక
7 ఆగష్టు 2022 04:59 శుక్ర కర్కాటకం
9 ఆగష్టు 2022 03:01 బుధ పుబ్బ
9 ఆగష్టు 2022 22:34 శుక్ర పుష్యమి
10 ఆగస్ట్ 2022 20:27 కుజ వృషభం
17 ఆగష్టు 2022 07:23 రవి మఖ సింహ
18 ఆగష్టు 2022 10:10 బుధ ఉత్తర
20 ఆగష్టు 2022 19:58 శుక్ర ఆశ్లేష
21 ఆగష్టు 2022 01:42 బుధ కన్య
24 ఆగష్టు 2022 19:23 కేతు
27 ఆగష్టు 2022 19:44 కుజ రోహిణి
30 ఆగష్టు 2022 18:30 బుధ హస్త
31 ఆగష్టు 2022 03:17 రవి పూర్వఫల్గుణి
31 ఆగష్టు 2022 15:55 శుక్ర మఘ, సింహం
11 సెప్టెంబర్ 2022 10:41 శుక్ర పుబ్బ
13 సెప్టెంబర్ 2022 21:14 రవి ఉత్తర ఫల్గుణి
17 సెప్టెంబర్ 2022 07:21 రవి కన్య
19 సెప్టెంబర్ 2022 19:01 బుధ(వ) ఉత్తర
22 సెప్టెంబర్ 2022 04:22 శుక్ర ఉత్తర
24 సెప్టెంబర్ 2022 06:19 కుజ మృగశిర
24 సెప్టెంబర్ 2022 20:38 శుక్ర కన్య
27 సెప్టెంబర్ 2022 12:43 రవి హస్త
2 అక్టోబర్ 2022 21:09 శుక్ర హస్త
11 అక్టోబర్ 2022 01:45 రవి చిత్త
13 అక్టోబర్ 2022 13:21 శుక్ర చిత్రం
14 అక్టోబర్ 2022 07:15 బుధ హస్త
16 అక్టోబర్ 2022 03:54 కుజ మిథునం
17 అక్టోబర్ 2022 19:22 రవి తుల
18 అక్టోబర్ 2022 18:07 కేతు స్వాతి
18 అక్టోబర్ 2022 21:14 శుక్ర తుల
22 అక్టోబర్ 2022 14:45 బుధ చిత్రం
24 అక్టోబర్ 2022 05:01 శుక్ర స్వాతి
24 అక్టోబర్ 2022 12:18 రవి స్వాతి
26 అక్టోబర్ 2022 13:29 బుధ తుల
30 అక్టోబర్ 2022 12:35 బుధ స్వాతి
3 నవంబర్ 2022 20:20 శుక్ర విశాఖ
6 నవంబర్ 2022 20:27 రవి విశాఖ
7 నవంబర్ 2022 14:59 బుధ విశాఖ
11 నవంబర్ 2022 19:45 శుక్ర వృశ్చికం
13 నవంబర్ 2022 21:00 బుధ వృశ్చికం
13 నవంబర్ 2022 23:17కుజ(వ) వృషభం
14 నవంబర్ 2022 11:32 శుక్ర అనూరాధ
15 నవంబర్ 2022 23:43 బుధ అనూరాధ
16 నవంబర్ 2022 19:15 రవి వృశ్చికము
20 నవంబర్ 2022 02:34 రవి అనురాధ
24 నవంబర్ 2022 13:21 బుధ జ్యేష్ఠ
25 నవంబర్ 2022 02:33 శుక్ర జ్యేష్ఠ
3 డిసెంబర్ 2022 06:50 రవి జ్యేష్ఠ
3 డిసెంబర్ 2022 06:28 బుధ మూల,ధనుస్సు
4 డిసెంబర్ 2022 20:38 కుజ(వ) రోహిణి
5 డిసెంబర్ 2022 17:34 శుక్ర మూల,ధనుస్సు
12 డిసెంబర్ 2022 06:04 బుధ పూర్వాషాఢ
16 డిసెంబర్ 2022 08:41 శుక్ర పూర్వాషాఢ
16 డిసెంబర్ 2022 09:58 రవి మూల ధనసు
22 డిసెంబర్ 2022 21:43 బుధ ఉత్తరాషాఢ
26 డిసెంబర్ 2022 23:53 శుక్ర ఉత్తరాషాఢ
28 డిసెంబర్ 2022 03:40 బుధ మకరం

29 డిసెంబర్ 2022 12:08 రవి పూర్వాషాడ
29 డిసెంబర్ 2022 15:43 శుక్ర మకరం
31 డిసెంబర్ 2022 01:09 బుధ(వ) ధనుస్సు
4 జనవరి 2023 16:43 బుధ(వ) పూర్వాషాఢ
6 జనవరి 2023 15:23 శుక్ర శ్రవణం
11 జనవరి 2023 14:13 రవి ఉత్తరాషాడ
14 జనవరి 2023 20:45 రవి మకరము
17 జనవరి 2023 07:23 శుక్ర ధనిష్ఠ
17 జనవరి 2023 14:41 శని కుంభం
22 జనవరి 2023 15:36 శుక్ర కుంభం
23 జనవరి 2023 04:27 కేతు
24 జనవరి 2023 16:28 రవి శ్రవణం
28 జనవరి 2023 00:01 శుక్ర శతభిషం
4 ఫిబ్రవరి 2023 14:40 బుధ ఉత్తరాషాఢ
6 ఫిబ్రవరి 2023 19:39 రవి ధనిష్ఠ
7 ఫిబ్రవరి 2023 07:12 బుధ మకరం
7 ఫిబ్రవరి 2023 17:40 శుక్ర పూర్వాభాద్ర
13 ఫిబ్రవరి 2023 రవి కుంభము
14 ఫిబ్రవరి 2023 16:12 బుధ శ్రవణం
15 ఫిబ్రవరి 2023 19:47 శుక్ర మీనం
18 ఫిబ్రవరి 2023 12:40 శుక్ర ఉత్తరాభాద్ర
20 ఫిబ్రవరి 2023 00:09 రవి శతభిషం
21 ఫిబ్రవరి 2023 08:46 రాహు అశ్విని
23 ఫిబ్రవరి 2023 13:08 బుధ ధనిష్ఠ
24 ఫిబ్రవరి 2023 13:12 గురు రేవతి
25 ఫిబ్రవరి 2023 01:55 కుజ మృగశిర
27 ఫిబ్రవరి 2023 16:37 బుధ కుంభం

1 మార్చి 2023 09:19 శుక్ర రేవతి
3 మార్చి 2023 16:04 బుధ శతభిషం
5 మర్చి 2023 06:24 రవి పూర్వభాద్ర
11 మార్చి 2023 04:03 బుధ పూర్వాభాద్ర
12 మార్చి 2023 08:14 శుక్ర మేషం,అశ్విని
13 మార్చి 2023 04:26 కుజ మిథునం
14 మార్చి 2023 23:18 శని శతభిషం
15 మర్చి 2023 06:34 రవి మీనము
16 మార్చి 2023 10:39 బుధ మీనం
18 మార్చి 2023 03:34 బుధ ఉత్తరాభాద్ర
18 మార్చి 2023 14:52 రవి ఉత్తరభాద్ర
23 మార్చి 2023 09:51 శుక్ర భరణి
24 మార్చి 2023 19:23 బుధ రేవతి
27 మార్చి 2023 10:29 కుజ ఆర్ద్ర
31 మార్చి 2023 14:47 బుధ అశ్విని బుధ మేషం
1 ఏప్రిల్ 2023 01:36 రవి రేవతి
3 ఏప్రిల్ 2023 14:51 శుక్ర కృత్తిక
6 ఏప్రిల్ 2023 10:46 శుక్ర వృషభం
8 ఏప్రిల్ 2023 23:30 బుధ భరణి
14 ఏప్రిల్ 2023 14:58 రవి అశ్విని మేషం
15 ఏప్రిల్ 2023 00:19 శుక్ర రోహిణి
22 ఏప్రిల్ 2023 04:12గురుఅశ్విని, మేషం
22 ఏప్రిల్ 2023 08:18 కుజ పునర్వసు
26 ఏప్రిల్ 2023 15:20 శుక్ర మృగశిర
28 ఏప్రిల్ 2023 06:40 రవి భరణి
2 మే 2023 13:35 శుక్ర మిథునం

## శ్రీ శుభకృత్ నామ సంవత్సరంలో తెలుగు మాసాధిపతులు

| తెలుగు నెలలు | అశ్వ మఘ మూల | భరణి పుబ్బ పూ.షా | కృత్తిక ఉత్తర ఉ.షా | రోహిణి హస్త శ్రవణ | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషం | పున విశాఖ పూ.భాద్ర | పుష్యమి అనూరాధ ఉ.భాద్ర | ఆశ్రేషా జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్ర (2022) | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 |
| వైశాఖ | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| జ్యేష్ఠ | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 |
| ఆషాఢ | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 |
| శ్రావణం | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 |
| భాద్రపదం | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| ఆశ్వయుజం | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 |
| కార్తీకం | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 |
| మార్గశీర్షం | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 |
| పుష్యం | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| మాఘం | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 |
| ఫాల్గుణం | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 |

## మాసాధిపతుల ఫలములు

1. **రవి :–** పనుల తొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పు ప్రయాణం, దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, అశాభంగం, శ్రమ, కోపం.
2. **చంద్రుడు :–** మాతృసౌఖ్యం, దధ్యన్నసౌఖ్యం, స్త్రీ సంభోగ సుఖం, మనోనైర్మల్యం, ఆనందం, గౌరవం, కృషి వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వకళాత్మభావం, లలిత కళల పట్ల కౌశల్యం, సప్త సంతాన పోషణం.
3. **గురు :–** ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతాన సౌఖ్యం, పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణం, స్థిర వృద్ధి, శాస్త్ర విజ్ఞానం, ధైర్యం, సర్వశుభం, శివదర్శనం.
4. **రాహు :–** ఆత్రుత, శ్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగల భయం, గుండెజబ్బు, క్షయ, ఉబ్బసము వంటి దీర్ఘరోగ బాధ.
5. **బుధ :–** బంధుగోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తకజన స్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్య సంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి.

   **శాంతి :–** విష్ణుభక్తి, విష్ణుస్తోత్రములు, పూజలు
6. **శుక్రుడు :–** తెల్లని బట్టలు ధరించుట, పరిమళ ద్రవ్యోప యోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధుర పదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గోలాభం, సర్వసుఖం, లక్ష్మీ స్తోత్రం.
7. **కేతువు :–** బంధువైరం, దుష్ట స్త్రీ పీడ, మనశ్చాంచల్యం, దైవభక్తి, అతి కోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది. పామువల్ల ప్రమాదం. తరచు నష్ట ద్రవ్యలాభం. ప్రాయశ్చిత్తాదివ్రత కర్మాచరణం, క్రతుదీక్షా తత్పరత.
8. **శని :–** ఏనుగుల వలన జంతువుల వలన భయం, నల్లని వస్త్ర లాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచ కార్యాచరణము, బుద్ధిమాంద్యం, అనవసర ప్రసంగం, విరక్తి, గర్భశూల, గుండెపోటు.

   **శాంతి :–** రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.
9. **కుజుడు :–** అధికారుల బెడద, ఆయుధముల వలన భయం, కార్యనాశనం, మనస్తాపం, మనఃకాఠిన్యం, దక్షిణ నైఋతి దిశాప్రయాణం, ఔషధసేవ, ధనమునకు ఇబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకం.

   **శాంతి :–** శివునకు అభిషేకం, కుజస్తుతి, దుర్గా స్తోత్రం.



# మేష రాశి

**అశ్విని 1,2,3,4,**
**భరణి 1,2,3,4, కృత్తిక 1**

| ఆదాయం-14 | వ్యయం-14 | రాజపూజ్యం-03 | అవమానం-06 |
|---|---|---|---|

గోచార ఫలితం : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితిని అనుసరించి ఫలితం ఉండును. సంవత్సర ఫలం: గురువు 2, 5, 7,9,11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిచ్చును. శని 3,6,11 రాశులలో రాహు, కేతువులు 3, 6, 10,11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిస్తారు.

గురువు : ఈ సంవత్సరమంతా గురువు మీనంలో అనగా ద్వాదశంలో ఉండును ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. శుభకార్యాలవల్ల ధనవ్యయం అధికమవుతుంది. స్థాన చలన సూచితం. ఆర్థిక ఇబ్బందులు కలవు. పశునష్టం. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి.

శని: సంవత్సరం ప్రారంభంనుండి 2022 ఏప్రిల్ 29 వరకు మరియు 2022 జులై 13 నుండి 2023 జనవరి 17 వరకు మకరంలో అనగా దశమంలో ఉండును శ్రద్ధతో పనిచేయాలి. లేనిచో వృత్తిలో ఆటంకాలు కలుగుతాయి. ఒక చెడువార్త వింటారు. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

2022 ఏప్రిల్ 29 నుండి 2022 జులై 12 వరకు మరియు 2023 జనవరి 18 నుండి సంవత్సరాంతం వరకు కుంభంలో అనగా లాభంలో ఉండును చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. సంతానాభివృద్ధికి సంబంధించిన శుభవార్త వింటారు. మంచి ఆరోగ్యం లభిస్తుంది. అవసరానికి డబ్బు చేతికి అందుతుంది. సుఖ సంతోషాలు ఉంటాయి. అదృష్టం వరిస్తుంది.

రాహువు: ఈ సంవత్సరమంతా రాహువు మేషంలో అనగా జన్మంలో ఉండును. విదేశీ ప్రయాణాలు చేస్తారు. ఓర్పు అవసరం. మాట విలువ కాపాడుకోవాలి . రాహు ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

కేతువు: ఈ సంవత్సరమంతా కేతువు తులలో అనగా సప్తమంలోఉండును స్వల్ప అనారోగ్య సమస్యలు ఉంటాయి. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

**ఏప్రిల్ 2022** లాభంలో శుక్ర బలం అనుకూలిస్తోంది. మీరు అనుకున్న పనులను నిర్విఘ్నంగా పూర్తి చేస్తారు. మానసికంగా దృఢంగా ఉంటారు. ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. ఉద్యోగంలో స్థాన చలన సూచనలున్నాయి. బంధుమిత్రులతో ఆచితూచి వ్యవహరించాలి. మనస్తాపం చెందుతారు. శారీరక శ్రమ పెరగకుండా చూసుకోవాలి. విష్ణుసహస్రనామాలు చదివితే మేలు.

**మే 2022** కుజ, బుధ, శుభస్థితివల్ల ఉత్సాహంతో పనిచేసి తలపెట్టిన కార్యాల్లో విజయం సాధిస్తారు. ధనలాభం పరిపూర్ణంగా ఉంది. సంతోషకరమైన వార్తను వింటారు. ఆత్మీయుల సలహాలు ప్రశాంతతను ఇస్తాయి. రవి,శుక్ర దోషం ఉంది. స్థానచలన సూచన. రవి,శుక్ర ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ 2022** బుధ, శుక్రుల శుభస్థితివల్ల చక్కని ఆలోచనా విధానంతో మీదైన రంగంలో విజయం సాధిస్తారు. కీర్తి పెరుగుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. అదృష్టప్రాప్తి ఉంది. బంధువుల సహకారం లభిస్తుంది. రవి, కుజుల దోషం ఉంది. శ్రమ అధికమవుతుంది. స్థానచలన సూచన. కొందరి ప్రవర్తన అపార్థాలకు దారితీస్తుంది. మనశ్శాంతి కొరకై రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై 2022** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల మీరనుకున్నది సాధించటానికి గెలుపు తలుపులు తెరుచుకుంటాయి. ఆర్థికంగా ప్రగతిని సాధిస్తారు. ఆరోగ్యంఅన్నివిధాలా సహకరిస్తుంది.

పుత్రసౌఖ్యంకలదు. బంధుమిత్రులతో కొన్నిమధుర క్షణాలు గడుపుతారు.కుజునిదోషం ఉంది. మనస్సు చెడును శంకిస్తుంది. కుజుని ధ్యానశ్లోకంచదివితేమంచి జరుగుతుంది.

**ఆగష్టు 2022** శుక్రుని శుభస్థితివల్ల వ్యాపారంలో భవిష్యత్ ప్రణాళికను రచిస్తారు. శత్రువులపై మీదే విజయం. ఒక వ్యవహారంలో డబ్బు చేతికందుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. గౌరవం తగ్గుతుంది. దుర్జన సహవాసం, సమయానికి భోజనం లేకపోవడం, పాపకర్మలు చేయటం జరుగుతుంది. ఆర్థిక నియంత్రణ అవసరం. అధికారుల వలన కోపం, అస్థిర బుద్ధివల్ల లేనిపోని ఇబ్బందులు వస్తాయి. మనస్తాపానికి గురౌతారు. శ్రమ పెరుగుతుంది. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబర్ 2022** బుధ, శుక్రుల శుభస్థితివల్ల తెలివితేటలతో అందరినీ ఆకట్టుకుంటారు. ధనప్రాప్తి కలుగుతుంది. కొత్త వ్యక్తుల పరిచయం వల్ల మీలోని ప్రతిభ విస్తరిస్తుంది. గౌరవ సన్మానాలు అందుకుంటారు. రవి, కుజుల దోషం ఉంది. వ్యవసాయం, వ్యాపారాల్లో అనుభవజ్ఞుల సలహాలు అవసరమవుతాయి. గిట్టనివారు మిమ్మల్ని తప్పుదోవ పట్టిస్తారు. శాంతంగా వ్యవహరించి సమస్యల్ని దూరం చేసుకోవాలి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబర్ 2022** రవి శుభస్థితివల్ల బలమైన ప్రయత్నాలు ఫలిస్తాయి. ధనలాభం, ఆరోగ్యం, బంధుమిత్రుల సమాగమం ఉన్నాయి. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. వత్తిళ్ళు పెరుగుతాయి. నోటిని అదుపులో ఉంచుకోవాలి. చేపట్టిన పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. శత్రు వర్గం వారితో జాగ్రత్త. చెడుస్నేహాలు తగ్గించుకోండి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబర్ 2022** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మొహమాటం వల్ల సమస్యలు ఎదురౌతాయి. ప్రతి విషయంలోనూ ఆచి తూచి వ్యవహరించాలి. ఖర్చులు అదుపు తప్పకుండా జాగ్రత్త పడాలి. మీ ప్రమేయం లేకుండానే మీమీద నింద పడుతుంది. బంధువులతో అప్రమత్తంగా ఉండాలి. శ్రమ అధికమవుతుంది. గృహరక్షణా విషయంలో భద్రతను పెంచాలి. ఆరోగ్యంపై శ్రద్ధ పెట్టాలి. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబర్ 2022** శుక్రుని శుభస్థితివల్ల చేపట్టిన కార్యములయందు విజయం సాధిస్తారు. వస్త్రలాభం, మంచి ఆరోగ్యం, గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ఖర్చులు అదుపు చేయండి. శ్రమ అధికమౌతుంది. మనస్సు చెడును ఊహిస్తుంది. స్వల్ప అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2023** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మాట పట్టింపులకు పోకూడదు. వృథా ప్రయాణాలు చేయకండి. శత్రువులతో జాగ్రత్త. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయరాదు. మాటల విషయంలో జాగ్రత్త. ఆర్థిక నియంత్రణ అవసరం. రవి, కుజ, బుధ, శుక్ర ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి 2023** రవి,శుక్రుల శుభస్థితివల్ల మీరు అనుకున్న పనిని విజయవంతంగా పూర్తి చేయగలుగుతారు. వస్త్ర, ధాన్య లాభాలు ఉంటాయి. ఆరోగ్యం సహకరిస్తుంది. మనోధైర్యం కలిగి ఉంటారు. విద్యార్థులు విద్యలో రాణిస్తారు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కుజ, బుధ, దోషం ఉంది. చేపట్టే పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. బంధువులతో ఆచి తూచి వ్యవహరించాలి. కుటుంబ సభ్యుల వల్ల శ్రమ అధికమౌతుంది. మనోవిచారం కలుగుతుంది. బుధ, కుజ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చ్ 2023** రవి, బుధుల శుభస్థితివల్ల ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తున్న ఒక కల నెరవేరుతుంది. వస్త్ర, ధనలాభాలు ఉన్నాయి. బంధుమిత్రులను కలుస్తారు. అధికారుల దర్శనభాగ్యం లభిస్తుంది. మంచి ఆరోగ్యం ఉంటుంది. కుజ, శుక్రుల దోషం ఉంది. వివాదాల వల్ల ప్రశాంతత లోపిస్తుంది. రెట్టించిన ఉత్సాహంతో పనిచేయాలి. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# వృషభ రాశి

**కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2**

**ఆదాయం-08 వ్యయం-08 | రాజపూజ్యం-06 అవమానం-06**

గోచార ఫలితం: జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితిని అనుసరించి ఫలితం ఉండును.

సంవత్సర ఫలం: గురువు 2,5,7,9, 11రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిచ్చును. శని 3, 6, 11, రాహు,కేతువులు 3, 6, 10,11 రాశులలో ఈ న్నప్పుడు శుభాన్నిస్తారు.

**గురువు :** ఈ సంవత్సరమంతా గురువు మీనంలో అనగా లాభంలో ఉండును గత కొంత కాలంగా పరిష్కారం కాని కొన్ని పనులు వెంటనే పరిష్కారమవుతాయి. కీర్తి పెరుగుతుంది. మీ ప్రతిభకు గుర్తింపు, మీ పనితీరుకు ప్రశంసలు లభిస్తాయి. శత్రువులపై విజయం సాధిస్తారు. శత్రువులు మిత్రులుగా మారుతారు. ఆరోగ్యం బాగుంటుంది. అన్నిటా మీదే విజయం. మంత్రసిద్ధి కలుగుతుంది. సుఖశాంతులతో పాటు భోగాలు అనుభవిస్తారు.

**శని :** సంవత్సరం ప్రారంభంనుండి 2022 ఏప్రిల్ 29 వరకు మరియు 2022 జులై 13 నుంది 2023 జనవరి 17 వరకు శని మకరంలో అనగా నవమంలో ఉండును కుటుంబ సభ్యులకు అనారోగ్య సమస్యలు వస్తాయి. శ్రమ అధికంగా ఉంటుంది. కొద్దిగా సుఖం, ధనం ఉంటాయి. దోషాలు తొలగటానికి శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

2022 ఏప్రిల్ 29 నుండి 2022 జులై 12 వరకు మరియు 2023 జనవరి 18 నుండి సంవత్సరాంతం వరకు శని కుంభంలో అనగా దశమంలో ఉండును శ్రద్ధతో పనిచేయాలి. లేనిచో వృత్తిలో ఆటంకాలు కలుగుతాయి. ఒక చెడువార్త వింటారు. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

ఈ సంవత్సరమంతా రాహువు మేషంలో అనగా ద్వాదశంలో ఉండును చేపట్టే పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. కంటి సమస్యలు ఇబ్బంది పెడతాయి. విదేశీ ప్రయాణాలు చేస్తారు. రాహు ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

ఈ సంవత్సరమంతా కేతువు తులలో అనగా షష్ఠంలో ఉండును ధైర్యంగా వ్యవహరిస్తారు. శత్రువులపై విజయం సాధిస్తారు. మంచి జరుగుతుంది. భూలాభములు చేకూరుతాయి.

**ఏప్రిల్ 2022** రవి, బుధల శుభస్థితివల్ల ఏకాగ్రతతో పనిచేసి సత్ఫలితాల్ని అందుకుంటారు. మాతృసౌఖ్యం కలదు. కీర్తి ప్రతిష్ఠలు వరిస్తాయి. ఆర్థిక శక్తి పెరుగుతుంది. శుక్ర, కుజుల దోషం ఉంది. ఆర్థికవిషయాల్లో జాగ్రత్తలు అవసరం. కుటుంబ సభ్యులతో సఖ్యతగా ఉండాలి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. శుక్ర, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే 2022** శుక్రుని శుభస్థితివల్ల వ్యాపారంలో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ఆర్థికంగా పుంజుకుంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అందరినీ కలుపుకు పోవడం వల్ల తలపెట్టిన కార్యం శీఘ్రంగా సిద్ధిస్తుంది. చంచల బుద్ధి వల్ల ఇబ్బందులు రావచ్చు. అనారోగ్య సమస్యలు రాకుండా జాగ్రత్తలు తీసుకోండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ 2022** కుజుని శుభస్థితివల్ల మనోధైర్యంతో పనిచేసి విజయం సాధిస్తారు. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. సంఘటనలు చికాకు కలిగిస్తాయి. ఆలోచనల్లో స్పష్టత లోపించకుండా ఇతరుల సలహాలు ఉపకరిస్తాయి. ఆర్థిక అవసరాలు పెరుగుతాయి. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. రవి, బుధ, శుక్రుల ధ్యాన

శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై 2022** శుక్రుని శుభస్థితివల్ల ధనధాన్య లాభాలుంటాయి. మంచి భోజన సౌఖ్యం. రవి, కుజ, బుధుల దోషం ఉంది. మొహమాటం వల్ల ఇబ్బందులు ఎదురౌతాయి. శ్రమ పెరుగుతుంది. చేతి దాకా వచ్చిన అవకాశాన్ని చేజారకుండా చూసుకోవాలి. అయినవారి వల్ల సమస్యలు రాకుండా జాగ్రత్తపడాలి. ఆరోగ్యంపట్ల జాగ్రత్త అవసరం. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు 2022** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం అన్ని విధాలా సహకరిస్తుంది. బంధుమిత్రులతో సంతోషంగా గడుపుతారు. అర్థలాభం. అనుకున్న పనులు నెరవేరతాయి. మీ బుద్ధిబలంతో కీలక సమస్యలను పరిష్కరించి అందరి మన్ననలను పొందుతారు. మాతృసౌఖ్యం, ధనధాన్యవృద్ధి, సన్మానం, సుఖం, విద్యావంతులతో పరిచయాలు ఏర్పడతాయి. కుజ దోషం ఉంది. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబర్ 2022** శుక్రుని శుభస్థితివల్ల చేపట్టే పనులు లాభదాయకంగా ముగుస్తాయి. మానసిక ప్రశాంతతతో ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. స్థానచలన సూచన. ఖర్చులు పెరగకుండా జాగ్రత్త వహించాలి. కొన్ని సంఘటనలు మానసిక ప్రశాంతతను తగ్గిస్తాయి. మాట పట్టింపులకు పోరాదు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబర్ 2022** బుధ, శుక్రుల శుభస్థితివల్ల నలుగురిలో మంచిపేరును సంపాదిస్తారు. కుటుంబంలో ఆనందం నెలకొంటుంది. గొప్పవారితో పరిచయాలు ఏర్పడతాయి. వారి సలహాలు ఉపకరిస్తాయి. వస్త్ర, సుఖ, సంతోషాలతో వర్ధిల్లుతారు. ఆరోగ్యం సహకరిస్తుంది. రవి, కుజుల దోషం ఉంది. శ్రమ పెరుగుతుంది. బంధుమిత్రుల కలహ సూచన. మనోవిచారం కలుగుతుంది. అకాలభోజనం. రవి, కుజుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**నవంబర్ 2022** రవి, బుధుల శుభస్థితివల్ల లక్ష్యాలకు చేరువవుతారు. వస్త్ర ధాన్యాది లాభములు ఉంటాయి. ఒక వార్త మీ మనోధైర్యాన్ని పెంచుతుంది. విద్య, వినోద సుఖాన్ని పొందుతారు. కుజ, శుక్రుల దోషం ఉంది. ఖర్చులు పెరగడంవల్ల ఆర్థిక ఇబ్బందులు తలెత్తవచ్చు. అనవసర విషయాల్లో తలదూర్చరాదు. ఆరోగ్యం పట్ల జాగ్రత్తలు పాటించాలి. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబర్ 2022** రవి ,కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మాట విలువను కాపాడుకోవాలి. తగాదాలలో తలదూర్చరాదు. విచారకర సంఘటనలు చోటుచేసుకున్నా అవి మీ అభివృద్ధిని ఆపలేవు. ఖర్చులు పెరగకుండా జాగ్రత్త వహించాలి. ఆరోగ్యం పట్ల జాగ్రత్తలు పాటించాలి. రవి ,కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2023** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యుల సలహాలతో విజయాలు సాధిస్తారు. స్వల్ప ధనలాభం, మనః సంతోషం కలుగుతాయి. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శారీరక శ్రమ పెరుగుతుంది. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. వివాదాలకు దూరంగా ఉండాలి.

**ఫిబ్రవరి 2023** రవి , కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఆర్థికంగా నష్టాలు రాకుండా ముందే జాగ్రత్తలు తీసుకోవాలి. బంధువులతో చనువుగా ఉండరాదు. సమయానికి ఆహార విశ్రాంతులు తీసుకోవాలి. మనశ్శాంతి కోసం దైవధ్యానం చేయాలి. రవి ,కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చ్ 2023** రవి, శుక్రుల శుభస్థితివల్ల పని నెరవేరుతుంది. వ్యాపారంలో రాణిస్తారు. ధనలాభం ఉంది. శత్రువులపై మీదే విజయం. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. కుజ, బుధుల దోషం ఉంది. అడుగడుగునా ఆటంకాలు వచ్చినా, బుద్ధిబలంతో అధిగమిస్తారు. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. మానసిక ఒత్తిడి పెరుగుతుంది. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# మిథున రాశి

**మృగశిర 3,4, ఆరుద్ర 1,2,3,4,**
**పునర్వసు 1,2,3**

| ఆదాయం-11 | వ్యయం-05 | రాజపూజ్యం-02 | అవమానం-02 |
|---|---|---|---|

గోచార ఫలితం : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితిని అనుసరించి ఫలితం ఉండును.

సంవత్సర ఫలం: గురువు 2, 5, 7,9,11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిచ్చును. శని 3,6,11 రాశులలో రాహు, కేతువులు 3, 6, 10,11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిస్తారు.

ఈ సంవత్సరమంతా గురువు మీనంలో అనగా దశమంలో ఉండును విజయం సాధించడంలో విఘ్నాలు అధికమవుతాయి. పరిస్థితుల ప్రభావం వల్ల పనులు ఆలస్యమవుతాయి. అదృష్టం దూరమవుతుంది. కాలం సహకరించదు. ఆర్థిక సమస్యలు పెరుగుతాయి. ధనధాన్య నష్టం సూచితం. వృధా సంచారాలు చేయాల్సి వస్తుంది. భయం, బంధు దూషణం ఉంటాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి.

సంవత్సరం ప్రారంభంనుండి 2022 ఏప్రిల్ 29 వరకు మరియు 2022 జులై 13 నుంది 2023 జనవరి 17 వరకు శని మకరంలో అనగా అష్టమంలో ఉండును పనులు నిదానిస్తాయి. శాంతంగా మాట్లాడాలి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. ఆర్థిక నియంత్రణ అవసరం. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. అనుకూల ఫలితాలకై శని ధ్యాన శ్లోక చదువుకోవాలి.

2022 ఏప్రిల్ 29 నుండి 2022 జులై 12 వరకు మరియు 2023 జనవరి 18 నుండి సంవత్సరాంతం వరకు శని కుంభంలో అనగా నవమంలో ఉండును కుటుంబ సభ్యులకు అనారోగ్య సమస్యలు వస్తాయి. శ్రమ అధికంగా ఉంటుంది. కొద్దిగా సుఖం, ధనం ఉంటాయి. దోషాలు తొలగటానికి శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

ఈ సంవత్సరమంతా రాహువు మేషంలో అనగా లాభంలో ఉండును పశులాభం, భోజన సౌఖ్యం ఉంటుంది. వస్తు, వస్త్ర ప్రాప్తితోపాటు లాభాలు, విజయాలు చేకూరుతాయి.

ఈ సంవత్సరమంతా కేతువు తులలో అనగా పంచమంలో ఉండును సమయానికి భోజనం చేయరు. సంతానంతో గొడవలు పడకుండా ఓర్పుగా వ్యవహరించండి. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

**ఏప్రిల్ 2022** భవిష్యత్తుకు సంబంధించిన విషయాలలో స్పష్టత వస్తుంది. మనోభీష్టం నెరవేరుతుంది. ఆదాయమార్గాలు పెరుగుతాయి. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల అండదండలు లభిస్తాయి. పిల్లల ప్రగతి ఆనందాన్ని కలిగిస్తుంది. ఆరోగ్యరీత్యా శుభఫలితాలున్నాయి. ఖర్చులు అదుపులో ఉంచుకోవాలి. స్థానచలన సూచితం.

**మే 2022** రవి శుభస్థితివల్ల అవసరానికి ధనం చేతికందుతుంది. ఆచారాలకి పెద్దపీట వస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. పనుల్లో ఆటంకాలు ఎదురైనా తెలివిగా పరిష్కరిస్తారు. కొందరు అదేపనిగా మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని చూస్తారు. శ్రమ అధికమవుతుంది. కలహ సూచన. ధైర్యంగా ఉండండి. దైవారాధన చేస్తే సత్ఫలితాలు పొందుతారు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ 2022** శుక్రుని శుభస్థితివల్ల పట్టుదలతో పనులు సాధిస్తారు. ధనధాన్యాభివృద్ధి ఉంటుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శ్రమ అధికమవుతుంది. కొన్ని విషయాల్లో చంచల స్వభావం ఉంటుంది. భయంగా అనిపిస్తుంది. బద్ధకం వదిలి పనిచేస్తే మంచి భవిష్యత్తు నిర్మించవచ్చు. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై 2022** కుజుని శుభస్థితివల్ల మనోధైర్యంతో ముందుకెళతారు. తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేస్తారు. ఆదాయ మార్గాలను పెంచుకుంటారు. ఆ మేరకు కొత్త నైపుణ్యాన్ని సంపాదిస్తారు. రవి, బుధ, శు

క్రుల దోషం ఉంది. ఆత్మీయులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. అనారోగ్య సమస్యలు ఇబ్బందిపెడతాయి. నిరుత్సాహాన్ని విడనాడాలి. పై అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు 2022** కుజ, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం సహకరిస్తుంది. ఆర్థికంగా బాగుంటుంది. ధైర్యంతో ముందడుగు వేసి అనుకున్న పనిని పూర్తి చేయగలుగుతారు. కీర్తి పెరుగుతుంది. సంతోషంగా గడుపుతారు. భోజన సౌఖ్యం ఉంది. రవి, బుధుల దోషం ఉంది. అనవసర ఖర్చులు పెరుగుతాయి. రవి, బుధ, ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబర్ 2022** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల తల్లి తరపు బంధువుల సహకారం లభిస్తుంది. సుఖసంతోషాలతో గడుపుతారు. ఆదాయమార్గాలను పెంచుకుంటారు. మీ తెలివితేటలతో అందరినీ మెప్పిస్తారు. గౌరవం లభిస్తుంది. ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న ఓ పని పూర్తవుతుంది. కుటుంబ సభ్యులకు మంచి కాలం. మిమ్మల్ని ప్రభావితం చేసేవారితో పరిచయం ఏర్పడుతుంది. ఆరోగ్యం సహకరిస్తుంది. కుజుని దోషం ఉంది. సమయానికి భోజనం ఉండదు. మనస్సు చెడును శంకిస్తుంది. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబర్ 2022** శుక్రుని శుభస్థితివల్ల దుఃఖనాశనం, మహాసౌఖ్యం పొందుతారు. బంధుమిత్రులను కలుస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధుమిత్రులతో గొడవలు తెచ్చుకోకండి. కుటుంబ సభ్యుల ఆరోగ్యం జాగ్రత్త. కొన్ని సంఘటనల వల్ల ఉత్సాహం తగ్గుతుంది. పనిలో అడ్డంకులు వస్తాయి. విదేశ ప్రయాణాలు చేస్తారు. పై అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబర్ 2022** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. కీర్తి పెరుగుతుంది. వస్త్రలాభం ఉంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధుమిత్రులతో వైరం సూచితం. ఖర్చులు పెరుగుతాయి. విచారం, చిన్నపాటి అనారోగ్య సమస్యలు బాధిస్తాయి. ఆవేశపూరిత నిర్ణయాలు వద్దు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబర్ 2022** రవి శుభస్థితివల్ల ఆరోగ్యం బాగుంటుంది. సంపాదనలో స్థిరత్వం వస్తుంది. బంధుమిత్రులను కలుస్తారు. ఒక ముఖ్యమైన విషయంపై పెద్దలను కలుస్తారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. శ్రమ అధికమౌతుంది. మాట విలువను కాపాడుకోవాలి. ఆర్థిక భారం పెరగకుండా జాగ్రత్తపడాలి. శత్రువర్గం పెరుగుతుంది. నిరుత్సాహం చెందవద్దు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2023** శుక్రుని శుభస్థితివల్ల అనుభవజ్ఞుల సలహాలతో విజయం సాధిస్తారు. వస్త్రలాభం కలదు. గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. వృథా ప్రయాణాల వల్ల నిరుత్సాహం, విచారం, కలుగుతాయి. ఒక వార్త మీ మనస్సుని కలవరపెడుతుంది. అల్పాహారం వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తుతాయి. శత్రువులు పెరుగుతారు. మీ ప్రమేయం లేకుండానే మిమ్మల్ని నిందిస్తారు. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి 2023** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. మీ పనితీరుకి గుర్తింపు లభిస్తుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. చేపట్టే పనిలో ఆటంకాలు ఎదురౌతాయి. వ్యాపారంలో జాగ్రత్తలు అవసరం. ఆర్థికపరంగా జాగ్రత్తలు తీసుకోవాలి. విదేశీయానం సూచితం. కొందరి ప్రవర్తన ఇబ్బందనిపిస్తుంది. బంధువులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చ్ 2023**రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఎవ్వరినీ అతిగా నమ్మకండి. స్వల్ప అనారోగ్య సమస్యలు ఉంటాయి. ఉద్యోగంలో స్థానచలనం సూచితం. గిట్టనివారు మీ ఉత్సాహంపై నీళ్లు చల్లుతారు. ఆర్థిక విషయంలో కొంత శ్రద్ధ అవసరం. దైవధ్యానంతో ఆపదలనుండి బయటపడతారు.



# కర్కాటక రాశి

**పునర్వసు 4, పుష్యమి 1,2,3,4, ఆశ్రేష 1,2,3,4**

| ఆదాయం-05 | వ్యయం-05 | రాజపూజ్యం-05 | అవమానం-02 |
|---|---|---|---|

గోచార ఫలితం : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితిని అనుసరించి ఫలితం ఉండును.

సంవత్సర ఫలం: గురువు 2,5,7,9, 11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిచ్చును.

శని 3, 6, 11, రాహు, కేతువులు 3, 6, 10,11 రాశులలో ఉన్నప్పుడు శుభాన్నిస్తారు.

ఈ సంవత్సరమంతా గురువు మీనంలో అనగా నవమంలో ఉండునుగురువు నవమంలో ఉన్నందున ధనలాభంతో పాటు స్వగృహప్రాప్తి కలుగుతుంది. భాగ్య బృహస్పతి వల్ల ఆస్తిని వృద్ధి చేస్తారు. ఆచార సాంప్రదాయ చాలతోపాటు గౌరవం పెరుగుతుంది. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. సుఖ సంతోషాలను అనుభవిస్తారు.

సంవత్సరం ప్రారంభంనుండి 2022 ఏప్రిల్ 29 వరకు మరియు 2022 జులై 13 నుంది 2023 జనవరి 17 వరకు శని మకరంలో అనగా సప్తమంలో ఉండును ఖర్చులు పెరుగుతాయి. ఆరోగ్యంపై శ్రద్ధ తీసుకోవాలి. విదేశయోగం ఉంటుంది. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

2022 ఏప్రిల్ 29 నుండి 2022 జులై 12 వరకు మరియు 2023 జనవరి 18 నుండి సంవత్సరాంతం వరకు శని కుంభంలో అనగా అష్టమంలో ఉండును పనులు నిదానిస్తాయి. శాంతంగా మాట్లాడాలి. ఆరోగ్యంపై శ్రీద్ధ వహించాలి. ఆర్థిక నియంత్రణ అవసరం. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. అనుకూల ఫలితాలకై శని ధ్యాన శ్లోక చదువుకోవాలి.

ఈ సంవత్సరమంతా రాహువు మేషంలో అనగా దశమంలో ఉండును చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. భోజన సౌఖ్యం, సంతోషం ఉంటాయి. శరీరబలం పెరుగుతుంది. సర్వత్రా సుఖం లభిస్తుంది. వస్తు, వస్త్ర ప్రాప్తితో పాటు లాభాలు, విజయాలు చేకూరుతాయి.

ఈ సంవత్సరమంతా కేతువు తులలో అనగా చతుర్థంలో ఉండును బుద్ధి స్థిరంగా ఉండదు. పనుల్లో ఆటంకాలు వస్తాయి. భయం, వాతరోగ సమస్యలు వస్తాయి. అకాల భోజనం, త్రిప్పుట తప్పవు. సంతానంతో గొడవలు రాకుండా జాగ్రత్తగా వ్యవహరించాలి. కేతు ధ్యానశ్లోకం చదువుకోవాలి.

**ఏప్రిల్ 2022** శుక్రుని శుభస్థితివల్ల చిత్తశుద్ధితో పనిచేసి విజయాలను సొంతం చేసుకుంటారు. ధర్మకార్యాలను చేపడతారు. మీ స్వధర్మం మిమ్మల్ని కాపాడుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అపకీర్తి కలిగించేవారు ఎదురవుతారు. వృథా ప్రయాణాలు తప్పకపోవచ్చు. ఒక వార్త మిమ్మల్ని మనస్తాపానికి గురిచేస్తుంది. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. భయాందోళనలు విడనాడాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే 2022** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల సమయస్ఫూర్తితో వ్యవహరించి విజయాలు సాధిస్తారు. ఆలోచనలే పెట్టుబడిగా లాభాలను అందుకుంటారు. ఒక ముఖ్యమైన విషయమై పెద్దలను కలుస్తారు. ఫలితం అనుకూలంగా వస్తుంది. సంతోషాన్నిచ్చే సంఘటనలు చోటు చేసుకుంటాయి. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుజుని దోషం ఉంది. ఇబ్బంది పెట్టేవారు పక్కనే ఉండి సమస్యలను సృష్టిస్తారు. కలహాలకు దూరంగా ఉండండి. ఆవేశపడరాదు. నిదానంగా వ్యవహరించండి. కుజుని ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ 2022** రవి, బుధుల శుభస్థితివల్ల మీకు అప్పగించిన బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహిస్తారు. దేహారోగ్యం, సంతోషం, వస్త్ర ధాన్యాది లాభములు సిద్ధిస్తాయి. మనోధైర్యం కలిగి ఉంటారు. కుజ, శుక్రుల దోషం ఉంది. కుటుంబ కలహాలు రాకుండా జాగ్రత్తపడాలి. కొందరి ప్రవర్తన బాధ కలిగిస్తుంది.

